# జమీన్ రైతు

స్థాపకులు: నెల్లూరు వెంకటరామానాయుడుగారు

సంపాదకుడు: నెల్లూరి శ్రీరామమూర్తి

Regd. No. H. NL. 15
స్థాపితం: 1930
సంపుటి 67 సంచిక 37
12-9-1986
శుక్రవారం
12 పేజీలు రూపాయి


# మళ్లీ సంక్షోభం కొనితెచ్చుకుంటారా?

సచివాలయం సిబ్బంది సమ్మె విరమించి డ్యూటీలకు హాజరౌతున్న దాని ప్రభావం, తదనంతర పరిణామాలు మాత్రం రాష్ట్రాన్ని మరొకసారి సంక్షోభానికి గురిచేస్తాయా అని సందేహం కలుగుతుంది. ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావు మొదటిరోజు ఉద్యోగుల హింసాకాండను, ఓర్పుగా సహించి, వారు తమబిడ్డలని, క్షమించి వదిలేస్తామని ప్రకటించారు. అయితే ఇప్పుడాయనలో ఆ క్షమాగుణం కన్పించడంలేదు పైపెచ్చు, కఠినచర్యలు తీసుకొని క్రమ

కలిసి, ఉద్యోగులు చేసిన తప్పులు క్షమించి వదిలేయమని బ్రతిమాలారట. వీరేకాక, కొందరు ఉన్నతాధికారులు కూడా ఉద్యోగుల పక్షంగా రాయబారం వెళ్ళి తెగేదాకా తాడును లాగవద్దనిసలహా ఇచ్చి వచ్చారట.

కాని, ఈ రాయబారాలు, కాళ్ళ బేరాలకు ముఖ్యమంత్రి మనసు కరిగిన దాఖలేవీ కన్పించడంలేదు. ఆయన తనకు తానుగా ఈ చర్యలు తీసుకొంటున్నట్లు గాక, మంత్రులందరి వత్తిడిపై, విధిలేక వ్యవహరిస్తున్నట్లు పైకి చెప్తున్నారు.

కుల పట్ల ప్రభుత్వం ఇంత కఠినంగా వ్యవహరిస్తే, ఎన్జీఓ సంఘాలు ఊరుకుంటాయా అన్నది ప్రశ్న. తాము చేసింది తప్పయినప్పటికీ, ఆ తప్పు తమ జీవితాలకే ముప్పు తెస్తుంటే వీరు మౌనం వహించి వుంటారనుకోలేము. తమకు ప్రజల మద్దతు, సానుభూతి లభించినా, లభించకపోయినా వీరు ఆందోళనకు దిగి తీరుతారని పరిశీలకుల అభిప్రాయం. అటువంటి పరిస్థితే ఎదురైతే, ప్రభుత్వం మరొకసారి ప్రతిష్టంభనకు గురికావలసి వస్తుంది. కోరికోరి అటువంటి క్లిష్ట పరిస్థితులను కొనితెచ్చుకుంటారా, ఎన్టీఆర్?

* * *

- ★ పోలీసులకు క్షమాభిక్ష?
- ★ ఉద్యోగులపై కఠిన చర్య?
- ★ తీవ్రవాదుల చేజిక్కిన సమసంఘర్షణ సమితి
- ★ ఎ. వి. ఎస్. రెడ్డి 'సస్పెన్షన్' పై ఐ. ఎ. ఎస్. వర్గాల ప్రతిస్పందన?

నవసంఘర్షణ సమితికి చెందిన విద్యార్థి నాయకులతో ముఖ్యమంత్రి ఎన్టీ రామారావు కుదుర్చుకున్న ఒప్పందం తమకు సుతరామూ గిట్టదని నవసంఘర్షణ సమితి తేల్చి చెప్పేసింది. ఇంకొక

—తరువాత 7వ పేజీలో

**మా హైదరాబాదు విలేఖరి**

శిక్షణను పాదుకొల్పాలన్న దృఢసంకల్పంతో వున్నట్లు కన్పిస్తుంది.

నిజానికి ఉద్యోగుల ప్రవర్తనే ఆయనకి అవకాశం కల్పించింది. తొలిరోజు ఎంత అరాచకానికి పాల్పడినా, వయసులో వున్న, విద్యావంతులైన మెడికల్ కాలేజి విద్యార్థినులపట్ల పోలీసులు అసభ్యంగా ప్రవర్తించడంతో రెచ్చిపోయి, వళ్ళుతెలియని ఆవేశం కల్గిందని సమర్థించుకుని వుండేవారు; వారికి ప్రజల సానుభూతి కూడా లభించివుండేది. అయితే మరునటి రోజు అదే విశృంఖలత్వంతో పత్రికా విలేఖరులపై దాడిచేయడంతో, వారిపట్ల ప్రజలకు సానుభూతి పోయింది; ప్రభుత్వానికి అవకాశం చిక్కింది.

ఈ సంఘటనలపై దర్యాప్తుకు నియమించిన కార్యదర్శుల త్రయం కమీషన్ ఎదుట, ప్రెస్ ఫోటోగ్రాఫర్లు, విలేఖరులు బలమైన సాక్ష్యాలు సమర్పించారు. ఇంకొక ప్రక్క ఎన్జీఓ నాయకులు వీరిని

ఆయన అంతరంగంలో మాత్రం ఉద్యోగులపై కసి రగులుతున్నట్లు వార్తలు వినవస్తున్నాయి.

విశ్వసనీయ వర్గాలనుంచి సేకరించిన సమాచారాన్నిబట్టి, అరాచకానికి పాల్పడిన వారిలో దాదాపు 150 మంది ఉద్యోగులను గుర్తించారట. వారిలో 120 మందిమీదైనా కఠినమైన క్రమశిక్షణ చర్యలు తీసుకోవాలని ప్రభుత్వం తలపెడుతున్నట్లు తెలుస్తూంది. ఉద్యోగులను గుర్తించడానికి అధికారులు ప్రధానంగా పత్రికలలోని ఫోటోలపైన ఆధారపడినట్లు చెప్తున్నారు.

"ఎన్టీరామారావు తన్నులు తప్పించుకున్నారు" అని బహిరంగంగా ప్రకటన చేసిన ఉద్యోగుల నాయకుడు శంకరరావునుమాత్రం సర్వీసునుంచి డిస్మిస్ చేయాలని ముఖ్యమంత్రి పట్టుబడుతున్నారట.

అయితే ఉద్యోగుల పట్ల, వారి నాయ








# జమీన్‌రైతు

## సముచిత నిర్ణయం

రిజర్వేషన్ల వ్యవహారం ఎంత నాటకీయంగా మొదలైందో, అంతే నాటకీయంగా ముగిసింది! అయితే కథ సుఖాంతమా, కాదా అన్నసంగతి మరికొంతకాలం గడవందే చెప్పలేము.

9 తేది సాయంత్రం ప్రభుత్వం నవసంఘర్షణసమితి నాయకుల కోర్కెలన్నింటినీ ఆమోదించింది. ప్రభుత్వాలు ఉద్యమ నాయకులకు ఇంత బేషరతుగా లొంగిపోవడమనేది అరుదు. రిజర్వేషన్లు పెంచుతూ తీసుకున్న నిర్ణయాన్ని ఉపసంహరించడం, విద్యార్థి నాయకులపై పెట్టిన కేసులు వెనక్కుతీసుకోవడం, ఉద్యమంవల్ల విద్యార్థుల చదువుకు కల్గిన ఆటంకాలను తొలగించడం ఈ ఒప్పందంలో ప్రధానాంశాలు. మరొక విశేషమేమిటంటే, హైకోర్టు అనుమతించినప్పటికీ, హరిజన గిరిజనులకు పెంచిన రిజర్వేషన్లనుకూడా ఎన్టీరామారావు రద్దుచేశారు.

నిస్సందేహంగా ఇది విద్యార్థులకు ఘనవిజయమే. మన రాష్ట్రంలో ఎన్నో ఉద్యమాలను, ఇంతకంటే తీవ్రమైన ఆందోళనలను చూశాముకానీ, ఇంత స్వల్పకాలంలో కోరిన కోర్కెలన్నింటినీ ఈడేర్చుకోగల్గిన ఉద్యమం ఇదే మొదటిది.

ప్రభుత్వం రిజర్వేషన్ల విధానాన్ని పునఃపరిశీలించుకోవడానికి సమ్మతించడం, ఇందుకై మరొక చట్టబద్ధమైన కమీషన్ నియామకానికి నిశ్చయించడం, సముచితమైన నిర్ణయాలుగానే పరిగణించాలి.

ఒకవిధమైన ఆవేశంలో, ఉన్మాదంతో పోల్చదగిన ఉద్రేకంలో ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావు రిజర్వేషన్ల నిర్ణయం తీసుకున్నారు. ఆ సమయంలో ఆయన సాధ్యాసాధ్య విచారణ, మంచీచెడుల విచక్షణ, తదుపరి పరిణామాల యోచన చేయలేదు. అందువల్లే, ఈ నిర్ణయం ఇంతగా వివాదాస్పదమైంది; విద్యార్థులలో ఆందోళన చెలరేకెత్తించింది; ఉద్యమంగా రూపొందింది; ఇప్పుడు ప్రభుత్వం మెడలువంచి, తన నిర్ణయాన్ని తన చేతితోనే రద్దు చేయించింది.

అయితే రిజర్వేషన్ల నిర్ణయం ఎంత ఉరుకుమిడుకుగా తీసుకున్నారో, ఉపసంహరణకూడా అంతే వేగిరంగా చేశారన్న విమర్శ తలఎత్తుతూంది. విద్యార్థుల సంఘటితశక్తికి భయపడే ముఖ్యమంత్రి దారికివచ్చారన్నది నిర్వివాదాంశం; సుప్రీంకోర్టుకు అప్పీలుకుకూడా పోకూడదన్న విద్యార్థుల కోర్కెను సమ్మతించడం, రాజకీయంగా ప్రభుత్వ బలహీనతను సూచిస్తుంది! వెనుకబడిన తరగతులవారితో సమగ్ర సంప్రదింపులు జరపకుండా ఆయన ఈ ఒప్పందానికి రావడం, ఆ తరగతులలో అసంతృప్తికి, ఆందోళనకు దారితీసే ప్రమాదముంటుందికదా! ఇప్పుడు విద్యార్థులు నడిపినట్లే, రేపు వారూ ఒక పటిష్టమైన ఆందోళన నిర్వహిస్తే ప్రభుత్వం అప్పుడేమిచేస్తుంది? ఆశించినంతటి విజయం కల్గకపోయినప్పటికీ, వెనుకబడిన తరగతులవారు 9 తేది హైకోర్టు తీర్పుకు నిరసన బంద్ నిర్వహించారు; అది ప్రభుత్వానికి వ్యతిరేకంగా మార్పుచెందితే, ప్రతిఘటించగల్గిన రాజకీయస్థయిర్యం ప్రభుత్వానికి వుందా అన్నసందేహం కల్గుతూంది!

సంక్షోభం కల్గించే ఏ సమస్యకైనా 'కమీషన్' నియామకం కంటే పరిష్కారమార్గం లేదని నానుడి! ఎన్టీఆర్ కూడా అదేమార్గమవలంబించారు. కనీసం ఇప్పుడైనా ఆయన తొందరపాటు ప్రదర్శించకుండా, వాస్తవపరిస్థితులను సమగ్రంగా అధ్యయనంచేయించి, అనుభవజ్ఞులతో అన్ని రాజకీయపార్టీలు, విద్యార్థి ప్రతినిధులతో చర్చలుజరిపి, సలహాలుతీసుకుని, పరిస్థితి క్షుణ్ణంగా అవగాహన చేసుకున్నతర్వాత ఒక నిర్ణయానికి రావడం సముచితం. అర్థంపర్థం లేని ఆవేశానికో, స్వల్పకాల రాజకీయ ప్రయోజనాలకో లోనైతే ఇటువంటి అవాంతరాలు తప్పవు.

వెనుకబడిన తరగతుల నాయకులుకూడా ఉద్రేకాలకు లోనుకాకుండా, పరిస్థితిని అర్థంచేసుకొని, ప్రభుత్వం నియమించబోయే కమిషన్ నివేదిక అందేవరకు ఓర్పుపట్టడం సమంజసంగా వుంటుంది.

## జమీన్‌రైతు

11.9.1936

నెల్లూరులో మోటారు ప్రమాదం

8 తేదినాడు టప్పుబస్ యూనియన్‌వారి బస్సుక్రింద జన్నపాళెంలో ఒక గొల్లబాలికపడినది. చేయిమాత్రం చక్రంక్రిందపడి నలిగి వ్రేళ్ళునలిగి పోయినవి. హెల్తుఆఫీసరుగారి కారు కంటె సాయిబుగారి బస్ వాయువేగ మనోవేగాల్తో పోతుంది. దీని స్పీడు లిమిట్ చేసేవారులేరా?

గాంధీగారి ఆరోగ్యం

గాంధీ మహాత్మునికి జ్వరమొస్తున్నందున వార్తా పత్రికలలో వేర్కొన్నారు. ఆరోగ్యము కర్తిగరి నెమ్మదిగా వున్నది

నెల్లూరు మున్సిపాలిటి

వి. ఎం. కె రెడ్డిగారు, చైర్మను పాలనిన్ని తడుగుపాటి సుందరయ్య మీదకుతోస్తే, ముప్పయివేల సంవత్సరాదాయంగల కోదండరామస్వామిని.

### 50 ఏళ్ల క్రితం ఈవారం

భరించే దొడ్డవారికి యిది భారమైందా దీన్ని మీరే భరించమంటున్నారట సుందరయ్య రెంతూ ఏకలవానంజాత కుసుమాలే దీన్ని కాదంటారు?

* * *

ఇందుపూరు రోడ్డు సెభాంమీద నడుస్తోంది. మేకలు గొట్టేవారు, తొక్కి పెట్టేవారు. కంపో క కంపా లు, గొ గు ల పల్లి పు రి టి, సత్రైన్ని గ్రామాలకు మే కు లు కొడుతున్నారట. గోవిందన్నగారు, డియర్ బ్రదర్! ఇదెన్నో తర్యాయం మీ మేకులు గొట్టడం? వెర్రివెంగళప్పలారా! ఎలక్షన్ ఎత్తులోయి! మోసపోకండి. నిజమైతే అవసానకాలంలో మేకులు గొట్టకపోతే అయిదేండ్లు ఏమి చేశారు? అథవా నిజమైన ప్రయత్నమే అనుకోండి. ఎప్పుడో చేయాలసిన యిన్నాళ్ళవరకు చేయనందుకు సంజాయిషీ కోరాలే గాని యింత మాత్రానికే ఓట్లు వాగ్దానంచేయాలే? వద్దు! వద్దు!!

## ఉద్యోగుల్లో క్రమశిక్షణారాహిత్యం తగదు!

ముఖ్యమంత్రిని అవమానించి నమ్మకుదిగిన సచివాలయం సిబ్బందిని చూస్తుంటే, మొగుణ్ణికొట్టి మొగసాల కెక్కిందన్న సామెత గుర్తుకువస్తూంది. ప్రభుత్వంనుంచి జీతభత్యాలే కాకుండా, ఇళ్ళు, పిల్లల చదువులు, పండుగలు, పెళ్ళిళ్ళు, వైద్యం తదితర అవసరాలన్నింటిలో ప్రభుత్వంనుంచి సౌకర్యాలు పొందుతున్న ఉద్యోగులు, ఆ ప్రభుత్వం నిర్దేశించిన నియమాలు భంగపరిచి, రాజకీయ ప్రయోజనాలకోసం ప్రాకులాడడం శోచనీయం. అటవిక రాజ్యంలోకూడా నాయకుడికి ఎదురు చెప్పడం ఘోరమైన నేరం!

పోలీసులు, విద్యార్థులను బాదుతుంటే బాధ్యతకల్గిన ఉద్యోగులుగా వీరు ఉన్నతాధికారులకు ఆ విషయం చెప్పివుండాలి; లేదా శాంతియుతంగా నిరసన తెల్పివుండాలి అంతేతప్ప క్రమశిక్షణ విడచి ముఖ్యమంత్రిని ఘొరావ్‌చేయడం, నభ్యత మరచి తిట్టడం క్షమార్హంకాదు. ఏ పార్టీవాడైనా ముఖ్యమంత్రి. ముఖ్యమంత్రే! ఆ పదవికి గౌరవం ఇచ్చి తీరాల్సిందే! వీరు పత్రికలవారిపై దాడి చేయడం ఇంకా నేరం!

ఇంత క్రమశిక్షణా రాహిత్యంతో, బరితెగించి ప్రవర్తించిన ఉద్యోగులను వదలిపెడితే, ప్రభుత్వ ప్రతిష్ఠే మంటకలిసిపోతుంది. వీరిపై కఠిన చర్యలు తీసుకోవడం ప్రభుత్వ బాధ్యత.

హైదరాబాదు -దిగవల్లి వెంకటరత్నం

### గూడూరుకు మరొక రీడింగ్ రూం

గూడూరుటౌన్ అన్నివైపులా, అత్యంత వేగంగా అభివృద్ధి చెందుతూంది. ఈనాటి టౌనులోనే జనాభా 15 వేలకు మించిపోయింది. అయితే టౌనులో 7 రీడింగ్ రూములువుంటే, అన్నీ తూర్పుభాగంలోనే పెట్టారు; వాటిలో ఒకదానిని పడమటి టౌనుకు తరలించడమో, లేదా కొత్తగానైనా ప్రారంభించడమో చేస్తే పౌరులకు ఉపయోగంగా వుంటుంది. కమిషనర్‌గారు ఆలోచించాలి!

గూడూరు ఎం.ఎస్.పి. కృష్ణమూర్తి

### సిండికేట్ బ్యాంకిలో సేవే కరువైంది

ఖాతాదారుల సౌకర్యం, వారి సేవే మా భాగ్యమని బ్యాంకులన్నీ పెద్దపెద్ద బోర్డులు కట్టుకుంటాయి. కావలి సిండికేట్ బ్యాంకు బ్రాంచిలో ఈ బోర్డువుందో లేదో నాకు తెలియదుగాని, ఆ ప్రాంగణంలో సేవ అనే పదమే కరువైపోయింది. పెద్ద వ్యాపారస్థులు, ధనవంతులకు తప్ప, మామూలు చిల్లర కష్టమర్లు పోతే, బ్యాంకులో పలకరించే దిక్కే వుండదంటేలేదు, వందరూపాయలఖాతాలో జమ చేయడానికి 20 ఐదు రూపాయల నోట్లిస్తే, వాటిని లెక్కించే ఓపికలేక త్రిప్పిపంపేశారు. వంద కాగితాలైతేనే తీసుకుంటారట. మేనేజర్‌గారికి మొరపెట్టుకుందామంటే, ఆయన మావంటి వారికి దొరకనే దొరకరు.

జాతీయం తర్వాత బ్యాంకులు, సాధారణ సర్కారాఫీసులవలె తయారౌతున్నట్లున్నాయి!

కావలి -ఒక సగటు కస్టమర్

★

# సాలుచింతల చావులు- సాయిబాబాకథ నిజమేనా?

కోవూరు సమీపంలోని సాలుచింతలలో 8 తేది రాత్రి ఒక కుటుంబంలోని నలుగురు సభ్యులు ఆత్మాహుతికి పాల్పడ్డారు. వినడానికే విచిత్రంగా, నమ్మశక్యం కాకుండావుండే దర్ఘటన.

తిరుమూరు శ్రీనివాసులురెడ్డి (40) అనే రైతుకు సాయిబాబా అంటే అపరిమితమైన మూఢనమ్మకమట. అతన్ని దర్శిస్తాడు ఆ దేవుడు కలలో కన్పించి వింత వింత పనులు చేయమని ఆదేశిస్తుంటాడట; ఈ భక్తుడు వాటిని తుచ తప్పకుండా ఆచరిస్తుండేవాడట. ఈ పిచ్చితనంతో భార్య చేతులకు వాతలుకూడా పెట్టాడట ఒకసారి. ఇటీవల సాయిబాబా గారు ఏకంగా వీరి ప్రాణాలే నైవేద్యంగా అడిగాడట. అంతే, కన్నప్పవంటి ఈ భక్తుడు 8 తేది రాత్రి నీళ్ళలో ఎండ్రిన్ కలిపి సాయిబాబా తీర్థం అని చెప్పి భార్య, ఇద్దరు కుమారుల చేత త్రాగించాడట; అది సేవించి నలుగురూ నిండు ప్రాణాలు తీసుకున్నారట. వారి పేర్లివి- నిర్మల(34) కుమారరెడ్డి (17) మోహనరెడ్డి (14).

పోలీసులేకాదు, ఇరుగుపొరుగువారు కూడా అనేకకథనం వినిపిస్తున్నారు. అయితే అందులో సమాచారం దొరకని ప్రశ్నలు చాలావున్నాయి. శ్రీనివాసులురెడ్డి స్థితిపరుడే! స్వంత కట్టు పొలం వున్నాయట. ఆర్థికపరమైన ఇబ్బందులేవీలేవు. ఇటీవలే గ్రామోదయ పథకంక్రింద అప్పు తీసుకుని, ఇంట్లోనే 'సాయిబాబా వెల్డింగ్ వర్క్స్' అనే వర్క్‌షాపుకూడా నడుపుతున్నారట.

ఇంత నిశ్చింత జీవితం గడిపేవాడికి జీవితాన్ని ముగించుకోవలసిన అగత్యం ఎందుకు కల్గింది? అందరూ చెప్తున్న సాయిబాబా స్వప్నాదేశంకథ నమ్మతగిందేనా? శ్రీనివాసులురెడ్డి మూఢత్వంతో ఆత్మహత్యచేసినా, భార్యాపిల్లలు తెలియని పసివారేమీకాదు అకారణంగా విషంత్రాగడానికి వారెట్లాసమ్మతించారు? కనీస ప్రతిఘటనైనా చేసివుండాలికదా? అటువంటిదేమైనా జరిగిందా? జరిగివుంటే ప్రక్కింటివారైనా వచ్చి రక్షించే ప్రయత్నం చేసివుండాలికదా?

మేము విచారించినంతవరకు అటువంటి ప్రతిఘటన వున్నట్టు కన్పించడంలేదు. త్రాగిన చాలాసేపటికి, శ్రీనివాసులురెడ్డి భార్య కిటికీదగ్గరకువచ్చి కేకలు వేసిందట, అయితే ఇరుగు పొరుగువారు భయపడి, శ్రీనివాసులురెడ్డి బంధువులను పోతిరెడ్డిపాళెంనుంచి పిల్చుకొనివచ్చి, తలుపులు తీసి లోపలకుపోయారట. అప్పటికే అందరూ స్పృహతప్పి పడిపోయివుంటే, నెల్లూరు రామచంద్రారెడ్డిఆస్పత్రికి తరలించారటగాని, ప్రయోజనం లేకపోయింది.

ఈ దుస్సంఘటనకు కేవలం సాయిబాబా భక్తేకారణమని ఎవరూ నమ్మలేకపోతున్నారు. అయితే అసలు కారణమేమైవుంటుందోకూడా ఎవరూ వూహించలేకపోతున్నారు. దీనికి కొద్దిరోజులక్రితం శ్రీనివాసులురెడ్డికి, అతని తల్లికి ఆస్తి సంబంధంగా చిన్న వాగ్వివాదం జరిగిందట దానితో విరక్తిచెంది జీవితానికి ముగింపు పల్కివుంటాడా అనుకుంటే, అది అతనివరకే పరిమితం కావాలితప్ప భార్యాభర్తలకు వర్తించదు. కళంకవంటిదేమైనా వున్నాయా అనుకోవడానికి వీలు

—కొరవ 12 వ పేజీలో

## జిల్లావార్తలు

# ఇరిగినేని, గొట్టిపాటి తెలుగుదేశానికి తిలోదకాలిస్తారా?

కనిపిస్తున్న ప్రకాశం జిల్లా కాంగ్రెసులోకి ఒక సరికొత్త శక్తి ప్రవేశించబోతున్నదన్న వార్త జిల్లా నలుమూలల నుండి వినవస్తోంది. మొన్న మొన్నటి వరకు జిల్లా తెలుగుదేశంపార్టీ అధ్యక్షుడిగావుండి, ఆపార్టీ నిరాదరణకు గురై కనిగిరిలో ఇండిపెండెంటుగా శాసనసభకు పోటీచేసిన ఆ సమితి ప్రస్తుత మాజీ అధ్యక్షుడు శ్రీ ఇరిగినేని తిరుపతి నాయుడు, అలాగే పార్టీ అధిష్టానవర్గం తనమాట వినలేదన్న అలకతో జిల్లా పరిషత్ అధ్యక్షతకు రాజీనామా ఇచ్చిన శ్రీ గొట్టిపాటి హనుమంతరావు యిద్దరు తెలుగుదేశం పార్టీకి బాగా దూరంగా ఉన్నారు. ఇన్నాళ్ళ స్తబ్దత తర్వాత ఈ యిద్దరూ తమ రాజకీయ ఉనికిని కాపాడుకునేందుకు కాంగ్రెస్ పీఠన చేరవచ్చన్న వదంతి వచ్చింది. ఆ పార్టీలో వీరి ప్రవేశానికై చాలా 'కమ్మ'టి ప్రయత్నమొకటి ప్రచ్ఛన్నంగా జరుగుతున్నదనికూడా అంటున్నారు.

తెలుగుదేశంపార్టీ ఆవిర్భావం నుండి కూడా ఈ ఇద్దరు ప్రముఖులూ ఆపార్టీలో వున్నారు. మార్టూరునియోజకవర్గంనుండి 'దేశం' అభ్యర్థిగా ఎన్నికైన శ్రీ హనుమంతరావు ముఖ్యమంత్రి పెద్దల్లుడు డాక్టర్ వెంకటేశ్వరరావు కోసంగా ఆ స్థానాన్ని త్యాగంచేసి, ఆ త్యాగానికి ప్రతిగా జిల్లాపరిషత్ అధ్యక్షతని బహుమానంగా పొందారు. అయితే పార్లమెంటు ఎన్నికల్లో తనమాటను పార్టీ అధిష్టానవర్గం ఖాతరు చేయలేదన్న కినుకతో ఆత్మాభిమానం పొంగి ఆయన జిల్లాపరిషత్ అధ్యక్షపదవికి రాజీనామా చేశారు.

## ఒంగోలు న్యూస్

పోతే కనిగిరి సమితిమాజీరాజా ఐ.టి. నాయుడి పరిస్థితికూడా ఇంచుమించు యిలాంటిదే. ఒక జిల్లాపరిషత్ సర్వసభ్య సమావేశంలో ముఖ్యమంత్రి వియ్యంకులవారు శ్రీ మాజీ దగ్గుబాటి చెంచురామయ్యగారితట్ల దురుసుగా ప్రవర్తించి ఆయన అధిష్టానవర్గం ఆగ్రహానికి గురయ్యారు. అలాగే ఎక్కడో కిరసయినా లక్ష్ముడనే కుర్రాణ్ణి తానుగాకోతి రాజకీయాల్లోకిదించి సర్పంచ్‌నిచేసి, అతర్వాత

—కొరవ 8 వ పేజీలో

(కొరవ 1౦వ పేజీలో

# శివారెడ్డి పద్యాలు

వినాయకుడు

ఎక్కడో ఉండక కీర్తి దినమ్మొకటి
యుండియూరు గణపతేడుబట్ట
ఎవరినోటలబట్ట ఏముండో ఆయన్ని
అరవరానిలోకి అంగ సంగ!
పశువులంటిలాటి కొంటెక్కిపోతారు
తత్వదప్పులాలపైన మోజు
తిండిబోతు దేవదేవుడెట్టయ్యాడు?
తెంపలేసుకుంట పెద్దత్రళ్ళు!

నెల్లూరు మార్కెట్లో

పెన్నగమానె ధరలు చెప్పసాధ్యంగాదు
అబ్బ! కాయగూర్ల బంతకంత!
తల్లి మండమొయ్య నెల్లూరు మార్కెట్లో
పిడికట్ట పలిసు ఎంతచిట్టు!

ముష్టి కొండకాయ, చెప్ప కాకరకాయ,
ఆంతగద్దు దొండ అరటికాయ
పేద పూరుతీని గోరుచిక్కుడుకాయ
అందుబాటులుండి తంబకాయు!

కవిడి నారుబ్రీతి కరకాలుతీతంటె
వాలగంటె మోజు, వైపులేక
కాయగూర్లదింటు కాలమెల్లోనుండ
కవికినాకు యిదొక కలినకల!

# ఒంగోలు న్యూస్ (5వ పేజీ కొరవ)

తెలుగుదేశంపార్టీపుట్టాక దాని టిక్కెట్టుతో అతడ్ని కనిగిరికి శాసనసభ్యుడ్నిచేసి, మధ్యలో అతనితో గొడవపడి అతనిపైనే ఇండిపెండెంటుగాపోటీచేసి భంగపడ్డారు. ఒకప్పుడు తనముందు చేతులుకట్టుకు నిబ్బన్న ఈ కిరసనాయిలబ్బాయ్ ఇప్పుడు మంత్రిగా రాజలాంఛనాలతో కనిగిరిలో ఊరేగడం ఇ. టి. కి పంటికింది రాయిలా, కంటిలో నలుసులా ఒంటికి రానుకున్న కారంలావుంది. అందులోనూ రాబొయ్యే మండలాల ఎన్నికల్లో తాను ఎటూ కాని గాలిరాజకీయాలు వదిలి ఏదోఒక ప్రత్యామ్నాయపార్టీ నాశ్రయిస్తే తప్ప ఒడ్డునపడనన్న అభిప్రాయం ఆయనకుంది. 'ఏమిటి మీరు కాంగ్రెసు తలుపు తట్టబోతున్నారా?' అని ఈ విలేకరి ఒకమారు తిరుపతినాయుడిని అడిగిన ప్రశ్నకు ఆయన చిద్విలాసంగ నవ్వి మౌనం వహించడాన్నిబట్టి, అది నిజమేననుకోవాల్సి వస్తూంది. అయితే అక్కడ ఒంటరిగా తన వునికికి గుర్తింపు వుండదని జిల్లాపరిషత్ మాజీ అధ్యక్షుడు శ్రీ గొట్టిపాటి హనుమంతరావు కోసం ఆయన వేచిచూస్తున్నట్లనిపించింది.

వ్యక్తులుగా, నాయకులుగా అంతో ఇంతో జనంలోమంచిపేరు సంపాదించిన గొట్టిపాటి వంటి నాయకులు కాంగ్రెసులో కాలుగుబెట్టబోవడం నిజమైన కాంగ్రెసు అభిమానులకి ఆనందం కలిగించే విషయమైనా, యిప్పటికే రెండుగాచీలి పరస్పరారోపణలతో బజారుకెక్కిన జిల్లాకాంగ్రెసులో ఈ మూడోవర్గం ఎలాంటి పాత్ర వహిస్తుందో ఎవరివైపు నిలుస్తుందో అర్థంగాక అభిమానులకు అయోమయం ఏర్పడుతోంది. అయినా ముందు పరిణామాల్ని ఊహించే కంటే, వేచి చూడడమే బాగుంటుందేమో!

### తెప్పలుగా పారుతున్న తెలుగుదేశం అవినీతి

ఒంగోలు పట్టణంలో యిప్పుడు 'దేశం' అవినీతిగుట్టలు అపారంగా కనిపిస్తున్నాయి. ఒంగోలు టౌనులోనే కాపురముంటున్న యిద్దరు 'దేశం' శాసనసభ్యులు ఒకరి అవినీతిని మరొకరు తవ్వి గుట్టలు పోసుకుంటున్నారు. ఆ బడిలో ఆతనంత నంజుకున్నాడని ఒకరంటే, ఈ పంచాయితీ విభజనలో ఈయన ఎంత భుజించాడని మరొకరంటున్నారు. కాంట్రాక్టు నిర్మాణ కర్తలవద్ద చందాలు మూటలుగట్టుకుంటున్నాడని ఒక ఎం. ఎల్. ఏ. మీద అవతలి వర్గం ఆరోపణచేస్తే ఆక్వా కారుకొనడం కోసం చందాలకై దేశంమీద పడ్డాడని అవతలి యం. యల్. ఏ. పై ఇవతలి వర్గం ఆరోపిస్తోంది ఒక యం ఎల్. ఏ. గారికి క్లబ్బులో భాగముందంటే, ఇంకో యం. ఎల్. ఏ. గారికి సైరవీల దుకాణముందంటున్నారు. ఈ ఆరోపణలు నిజమెన్నో కొన్నో! ఇలాంటివి నిత్యం ఒంగోలు పట్టణంలో అపాకంగా రెండు వర్గాలనుండి వినవస్తుంటాయి ఒకపార్టీకి చెందిన ఈ యిద్దరు యం. ఎల్. ఏ. లు యిలాంటి పరస్పరారోపణలతో ఒకరిమీద ఒకరు బురదచల్లుకునే ప్రయత్నంలో యిక్కడి తెలుగుదేశం జండానే ఖరాబుచేస్తున్నారని అసలు సిసలు దేశం అభిమానులు బాధపడుతున్నారు.

ఈ ఇద్దరు ఎం. ఎల్. ఎ. ల పరస్పర అవినీతి ఆరోపణల ప్రహసనం ఒంగోలు పట్టణానికి మాత్రమే పరిమితం కాకుండా యిటీవల రాజధానికిగూడా చేరాయి. అక్కడ ముఖ్యమంత్రిగారి నేతృత్వంలో జరిగిన పార్టీ జిల్లాల సమీక్షల్లో ఈ జిల్లాకు సంబంధించి ఈ అవినీతికథలూ ప్రస్తావనకు వచ్చినట్లు తెలుస్తోంది.

వాస్తవానికి వీటిలో నిజాలెన్నో, రాజకీయకక్షతో సాగిస్తున్న ప్రచారాలెన్నో తెలియదు.

# సినిమా

(9 వ పేజీ కొరవ)

అందులోని వివరాలివి- "నేను సొంతంగా ఒక హిందీ చిత్రాన్ని నిర్మించదలచి, మద్రాసు ఉడ్‌లాండ్సు హోటల్‌లో హిందీ హీరో మిథున్ చక్రవర్తిని కలుసుకుని రెండులక్షల రూపాయలు అడ్వాన్సుగా ఇచ్చాను. ఆయన నాకు డేట్లు ఇవ్వలేదుగాని, బొంబాయికి వెళ్ళాక తాను వచ్చుకున్నది కాల్‌షీట్లు ఇవ్వగలనో తెలియచేస్తూ ఓ పుత్తరం రాశాడు. ఇటీవల ఆ నటుడు మద్రాసు వచ్చినపుడు నన్ను పిలిపించి, ఆ ఉత్తరాన్ని తనకు ఇచ్చేయమని తొందరపెట్టాడు. నేను శ్రీదేవితో ఒకచిత్రం గూర్చి షూటింగ్ నిమిత్తం బొంబాయి వెళ్ళినప్పుడు ఆ నటుడు బలవంతంగా నన్ను కారులో ఒకచోటికి తీసుకెళ్ళి చిత్రహింసలు పెట్టాడు అతర్వాత బొంబాయి బాంద్రా పోలీస్ స్టేషనుకు నన్ను తీసుకెళ్ళి, నామీద లేనిపోని నేరాలు మోపాడు. ఒకవేళ ఆ పోలీసువారు నన్ను అరెస్టుచేయడానికి వస్తే, నన్ను విడుదల చేసేలా ముందు జామీనుకు విజ్ఞప్తి చేస్తున్నాను" కోర్టువారు సెల్వంకు రెండువేల రూపాయల ధరావత్తు కట్టమని ఆదేశించారు. వి. కె. సెల్వం వయసు 28. చాలా కాలంగా మేకప్‌మన్‌గా వుంటున్నారు.

# పంచాంగం

### ఉత్తర కార్తె

13-9-86 తేది శనివారం పగలు 3-26 గంటలకు ఉత్తరకార్తె ప్రవేశం అనావృష్టి.

### మహాలయ పక్షము

18-9-86 తేది గురువారం నుండి 3-10-86 తేది శుక్రవారంవరకు మహాలయ పక్షము. ఈ పక్షమునందు శుభ కార్యములు ఆచరించకూడదు.

### సెప్టెంబరు తిథులు

13 శని దశమి సా 6-59 గం. వ.
14 ఆది ఏకాదశి సా 4-43 ,,
15 సోమ ద్వాదశి వ 2-42 ,,
16 మంగళ త్రయోదశి వ12-59 ,,
17 బుధ చతుర్దశి వ 11-34 ,,
అనంత వ్రతం
18 గురు పూర్ణిమ వ 10-44 ,,
19 శుక్రవారం బహుళ పాడ్యమి వ 10-14 ,,

—సిమ్మగడ్డ వెంకటేశ్వరశాస్త్రి

నా పిలుపే ప్రభంజనం

# రాష్ట్రంలో రాజకీయ ప్రభంజనం సృష్టిస్తుందా?

రాష్ట్రంలో పుద్రిక్త పరిస్థితి నెలకొనివున్న తరుణంలో కృష్ణచిత్రం "నా పిలుపే ప్రభంజనం" విడుదలవటం ఎలాంటి పరిస్థితులకు దారితీస్తుందోనని చిత్రపరిశ్రమలో కొందరు ఊహాగానాలు చేశారు. చిత్రం విడుదల వాయిదా పడవచ్చుని మరికొందరు భావించారు.. కాని, కృష్ణ ధైర్యంగా విడుదలజేస్తున్నారు. ఈ చిత్రంలో నేటి అస్తవ్యస్త రాజకీయ ధోరణులపై విమర్శ లున్నాయి. ముఖ్యంగా సాష్టాంగ నమస్కారాలు చేయించుకునే తరవీధనంపై ఎన్నో చెణుకులున్నాయి. ఇవి రాష్ట్రంలోని ప్రస్తుత పాలన కు వినుగుచెందివున్నవారికి మంచి వినోదాన్నిస్తాయి. అందుకే కృష్ణ సాహసవంతుడేకాదు; అదృష్టవంతుడుకూడా. పద్మాలయావారి "నా పిలుపే ప్రభంజనం" చిత్రానికి నెల్లూరి యుతు పి. చంద్రశేఖరరెడ్డి డైరెక్టరు.

### చిరంజీవి స్వంత చిత్రానికి బాలచందర్ డైరెక్టరు

"చంటబ్బాయి" వగైరా చిత్రాలు ఇటీవల విజయవంతమువలేదు. ఇంతలో

మా మద్రాసు సినీప్రతినిధి

కొత్త యువహీరోలు చిత్రరంగంలోకి ప్రవేశించి, యువతరం ప్రేక్షకులను విశేషంగా ఆకట్టుకున్నారు. ఈతరుణంలో చిరంజీవిని గట్టెక్కించడానికి పేరుమోసిన దర్శకుల అవసరం ఏర్పడింది. స్వంత చిత్రం అంజనా ఆర్ట్స్ పతాకంలో తయారవుతుంది. దీనికి కె. బాలచందర్ డైరెక్టరు. బావమరది అల్లు అరవింద్ నిర్మిస్తున్న "ఆరాధన" చిత్రానికి భారతీరాజా దర్శకుడు. పూర్ణోదయావారి చిత్రానికి కె. విశ్వనాథ్ దర్శకుడు. ఈ హేమాహేమీలైన దర్శకులవల్లనైనా చిరంజీవి తిరిగి పుంజుకోగలడని ఆశిద్దాం.

### హైకోర్టులో శ్రీదేవి మేకప్‌మన్ పిటిషన్

"మిథున్‌చక్రవర్తి నన్ను బెదిరించారు", అంటూ శ్రీదేవి మేకప్‌మన్ వి. కె. సెల్వం అగస్టు 30 న మద్రాసు కోర్టులో ఒక పిటిషన్ దాఖలుచేశారు.

—కొరవ 7వ పేజీలో

'చాణక్య శపథం'లో చిరంజీవి, విజయశాంతి

సమకాలీన సమాజ వాస్తవాలకు పట్టిన దర్పణం

# రేపటి పౌరులు

చిత్రసమీక్ష
సి. నారాయణరావు

కత్తితో చట్టాన్ని. న్యాయాన్ని. ధర్మాన్ని నిలువునాకొనేసి. ఈ దేశంలో అనునిత్యం అధర్మపాలన కొనసాగిస్తూ, తమ చర్యలతో సిరాఘాటంగా జేబులు నింపుకోవడమే ధ్యేయంగా ప్రవర్తించే వీరులు, ధనమదాంధులైన ఒక పోలీస్ ఆఫీసర్, ఒక లాయర్, ఒక డాక్టర్ పాత్రలను; వయసుమళ్ళి, కుళ్ళిన ఈ సంఘానికి మూలకారకులుగా చిత్రీకరించి, మరోప్రక్క మంత్రిగారి రాసలీలల్ని, ఆయన బలహీనతల్ని ప్రదర్శిస్తూ, ఇట్లా దుర్గంధ భూయిష్టమైన ఈ దేశం ఇక ముందు ఇంకెంత దుర్గతి పాలౌతుందోననే బాధ, ఆవేదన వ్యక్తంచేస్తూ టి. కృష్ణ రూపొందించిన చిత్రం 'రేపటిపౌరులు'. సాంఘికప్రయోజనం సాధించడం లక్ష్యంగా నిర్దేశించుకున్న చిత్రం ఇది.

బాధ్యతాయుతమైన ఉన్నతస్థానంలో వున్న వ్యక్తులే తప్పులమ్ముకుపోయి, నిర్భాగ్యతతో వ్యవహరిస్తే, ఆ పద్ధతులే రేపటితరానికి అలవడితే 'రేపటిపౌరులు' ఎంత నికృష్టంగా తయారవుతారు? రేపు ఏమవుతుందన్నదే ఈ సినిమా వేసే సూటిప్రశ్న? ఈ దేశం ముమ్ముందు ఏ దోపిడికి, ఏ దౌర్జన్యానికి తాకట్టు పాలవుతుందోనని ఈసినిమాకారునిబాధ!

ఒక టీచర్ తన విద్యార్థులకు నేర్పించిన నీతి, నిజాయితీలు క్రమశిక్షణాయుతమైన పద్ధతులు, తన పనులకు అడ్డుతగలడంతో ఆమెను బలవంతంగా అనుభవించి, చంపెయ్యాలని సాగించిన ప్రయత్నంలో ఈనాటి సామాజిక పాశవిక ప్రవృత్తిని కళ్ళకు కట్టినట్లు చూపాడు దర్శకుడు.

శిశుసంక్షేమశాఖ నిర్వహించే హాస్టల్ వార్డెన్ పోతులుపోయి, మంత్రిగారి నరాల్ని జివ్వనిపించి, ఆయన్ని వలలో వేసుకొని, నరుకుల్ని తన తమ్ముడి బెంగట్లో అందించడంవంటి సంఘటనలు ఈ సినిమాలో చాలావున్నాయి.

కార్లో ప్రయాణం సాగించే మంత్రిగారి అబ్బాయి తూలి, ఫుట్‌పాత్' పై నిద్రిస్తున్న పిల్లలపై నాట్యంచేయించి, వారి ప్రాణాల్ని బలితీసుకోవడంలాంటి ఘోరాలనునేర్పుగాచూపాడుదర్శకుడు. ఇట్లాంటి భయానక, బాధామయగాథలు ఎన్నో ఈ భారతంలో కోర్టు గుమ్మంచెంతకు సైతం చేరకుండా మాఫీ అవుతున్నాయి, మన కోసం గద్దెనెక్కిన పెద్దలచేతిలో. వీటన్నిటి నగ్న సందర్శనగా సన్నివేశాలు. రూపొందించారీ చిత్రంలో.

ఈ దృశ్యాన్నిచూపిన ఓ నిరుద్యోగ యువకుణ్ణి, శ్రీశ్రీ కవితలు వల్లెవేస్తూ ఆ ఘోర ప్రపంచంలో జీవించే ఆ జీవిని 'దౌర్జన్యం ఇంకానా, ఇకపై సాగదు' అని ముగించే తరుణంలో అది అబద్ధం అని రుజువుచేస్తూ మారణాయుధాల్తో భయంకరంగా చంపడం వంటి సంఘటనల్లు ఈ చిత్రానికి ఆయువుపట్టుగా నిల్చాయి.

చదువంటే భయం, అది నిరుద్యోగానికి హేతువనే నమ్మకం, ఎట్లా పాతుకుపోయిందో ఒక రిక్షా తొయినర్ మాటలు మనకు తెలియజెప్తాయి. చదువుకొంటానన్న కొడుకును ఈ దిల్లాగి బ్రాందీ షాపులో చేర్పడానికి 'చదస్తావే తప్ప ఐడికి తినవెల్లదు' ఈ విధంగా నిరుద్యోగ సమస్యనుఎత్తిచూపాడు దర్శకుడు.

చెప్పదలుచుకున్నది ఒక్కటే హేయమైన ఈ వాతావరణంలో బ్రతుకు సాగించే ఈ బాలలు, రేపును మరెంత హీనంగా సృష్టిస్తారో నని భయపడు

—కొరవ 11వ పేజీలో

# కృష్ణపరమాత్మ

## —దర్శకురాలి అసమర్థతతో అభాసుపాలైంది!

ఎల్. వి. రావు

తెలుగుచిత్రసీమలో సుమారు ముప్పై చిత్రాలకు దర్శకత్వంవహించి చరిత్ర సృష్టించిన ఏకైన మహిళా దర్శకురాలు శ్రీమతి విజయనిర్మల. అయితే రెండు మూడు చిత్రాలుతప్ప మిగతావన్ని ఘోర పరాజయాన్ని పొందడం తటస్థించిందను కోండి! చిత్రంపట్ల సరైనశ్రద్ధ అవగాహన లేకపోవడం, దర్శకత్వ సామర్థ్యం లోపించడం ఆమె చిత్రాలు దెబ్బతినడానికి కారణమనుకోవచ్చు. ఈ కోవకు చెందిందే, ఆమె తాజాచిత్రం 'కృష్ణ పరమాత్మ'.

నరసింహం పోలీస్ కమీషనర్. పత్రికాధిపతి, పురానాన్మగ్గర్ మన్మథరావుతో చేతులుకలిపి, ఆయనకు సహకరిస్తుంటాడు. క్రమశిక్షణ లోపించడంవల్ల నరసింహం కొడుకు విజయ్ కూతురు భానుమతి దురలవాట్లకు లోనవుతారు. నరసింహం బావమరది మేజర్ గోపీకృష్ణ వాళ్ళిద్దరినీ బాగుపరుస్తానని ఛాలెంజ్‌చేసి తనతో తీసుకెళాడు. వారిని సన్మార్గంలో పెట్టి,విజయ్‌ను డ్రైవర్‌గా మన్మథరావు క్లబ్‌లోనే చేర్పిస్తాడు. భానుమతికూడా అతనిపత్రికలోనే విలేఖరిగా చేరుతుంది. తర్వాత ఆమె రాజకీయాల్లోదిగి ఎన్నికల్లో గెలిచి, హోం మంత్రి అవుతుంది. విజయ్, భానుమతిల సహకారంతో నరసింహం, మన్మథరావు, నాగేంద్రరావుల దుష్కార్యాలను ప్రజలకు తెలియచేసి. వారికే వదలివేస్తారు గోపీకృష్ణ. ఇదే చిత్ర సారాంశం.

చిత్రంలో మలుపులు, మెరుపుల ప్రిప్పడంలో దర్శకురాలి అశ్రద్ధవల్ల గజిబిజిగా, గందరగోళంగా తయారైంది ఏ

—కొరవ 11 వ పేజీలో

టాక్సు రికవరీ ఆఫీసు, ఆదాయపు టాక్సు డిపార్టుమెంటు నెల్లూరు

## వేలం ప్రకటన

S. R. No. 117/84-85/NLR/I.T.

గూడూరు తాలూకా, వెన్నూరు గ్రామం శ్రీమతి దూది వెంకటశేషమ్మ గారి ఈ దిగువ వివరించిన భూములను, శ్రీ దూది కృష్ణయ్యగారి గిఫ్టు టాక్సు బాకాయిల నిమిత్తం టాక్సు రికవరీ ఇన్‌స్పెక్టర్ వారిచే 26-9-86 తేదిన నెల్లూరు, రంగనాయకులపేటలోని టాక్సు రికవరీ ఆఫీసునందు బహిరంగ వేలము వేయబడును. ఆసక్తికలవారు పాల్గొనవలసినదిగా కోరడమైనది.

| | ఖాతా నం | సర్వే నం. | విస్తీర్ణం | గ్రామం |
|---|---|---|---|---|
| 1) | 33 | 588/బి/ఎ | య 1-03 | వెన్నూరు |
| 2) | 382 | 1642 | య 1-91 | వెన్నూరు |

టాక్సు రికవరీ ఆఫీసర్, నెల్లూరు,

టాక్సు రికవరీ ఆఫీసు (ఆదాయపు టాక్సు డిపార్టుమెంటు-నెల్లూరు

## వేలం ప్రకటన

Ref. No. S. R. 32, 33, 34/51/N.L.R./I.T.

గూడూరు తాలూకా, వెన్నూరు గ్రామ కాపురస్తులు శ్రీమతి చదలవాడ రుక్మిణమ్మ మరియు ఆమె భర్త రామచంద్రయ్యగారి, ఈ దిగువన తెలుపబడిన ఆస్తులను, శ్రీ కేటు పొన్నా రఘురామయ్యగారి ఆదాయపుటాక్సు బకాయిల నిమిత్తం టాక్సు రికవరీ ఇన్‌స్పెక్టర్ వారిచే, నెల్లూరు రంగనాయకులపేటలో గల టాక్సు రికవరీ ఆఫీసునందు తేది 25-9-86 న బహిరంగ వేలము వేయబడును. ఆసక్తిగలవారు పాల్గొనవలసినది

1) మిద్దె నం. 44/6, వెన్నూరు గ్రామం
2) వ్యవసాయభూమి సర్వే నం. 456/1 య 1 25
3) వ్యవసాయభూమి సర్వే నం. 463/ఎ-2 య 1-00

టాక్సు రికవరీ ఆఫీసర్, నెల్లూరు

శ్రీ రేబాల కోదండరామిరెడ్డి ఛారిటీస్
నార్తుమోపూరు, అల్లూరు మండలం-నెల్లూరుజిల్లా

## టెండరు నోటీసు

శ్రీ రామలింగేశ్వర స్వామివారి దేవస్థానము-నార్తుమోపూరు నెల్లూరు మండలం-నెల్లూరుజిల్లా శ్రీ రామలింగేశ్వర స్వామివారి విమాన గోపురము పను అనుభవం కల్గిన రిజిష్టరు శిల్పి కాంట్రాక్టర్ల నుండి నిర్ణీత ఫారములో సీల్డు అయిటము రేటు టెండర్లు కోరబడుచున్నవి.

| నం | పని పేరు | ఎస్టిమేటు విలువ | టెండరు ధరావత్తు | పని కాలం | టెండరు ఫారం ఖరీదు |
|---|---|---|---|---|---|
| 1) | శ్రీ రామలింగేశ్వర స్వామి వారి దేవస్థానము విమాన గోపురము రెన్నొవేషన | 37000/- | 925/- | 3 నెలలు | 30/- |

1) టెండరు ఫారముల కొరకు 1-10-86 సాయంకాలం 5 గం॥ లోపు టెండరు ఫారముల ఖరీదు చెల్లించి దరఖాస్తు పొందవలెను.
2) టెండరు ఫారములను 3-10-86, 4-10 86 తేదులలో ఆఫీసు పనిచేయు వేళలలో దేవస్థానము ఆఫీసు నుండి పొందవచ్చును.
3 టెండరు ఫారమును పూర్తిచేసి 6-10-86 తేది మధ్యాహ్నం 2 గం॥ లోపల శ్రీ రేబాల కోదండరామిరెడ్డిగారి ఛారిటీసు కార్యనిర్వహణాధికారి కార్యాలయమునకు చేర్చవలెను.
4) టెండర్లను హాజరయిన టెండరుదారుల సమక్షమున 6-10-86 తేది సాయంకాలం 3-30 గం॥లకు శ్రీ రామలింగేశ్వరస్వామివారి దేవస్థానమునందు కార్యనిర్వహణాధికారిచే తెరువబడును
5) టెండరు ధరావతును దేవస్థానమునందు ముందుగా చెల్లించి రసీదు పొందవలెను. లేదా డిమాండు డ్రాప్టును కార్యనిర్వహణాధికారి పేరన నెల్లూరు సిండికేటు బ్యాంకు బ్రాంచిమీద తీసుకొని టెండరు ఫారముతో జతపరచవలెను.
6) కాంట్రాక్టర్లు అనుభవం మరియు రిజిష్టరు ప్రూఫ్ లెటర్ టెండరుతో జతపరచవలెను
7) ఏట్టి కారణము చూపకుండా ఏ టెండరునైనను లేదా అన్ని టెండర్లను కొంతభాగముగాని పూర్తిగా కాని అంగీకరించుటకు గాని తిరస్కరించుటకు గాని కార్యనిర్వహణాధికారికి అధికారము కలదు
8) మిగిలిన వివరములు పై దేవస్థానమునందు అడిగి తెలుసుకొనవచ్చును

9-9-86 తేది
నార్తుమోపూరు

ఎం. పెంచలయ్య
కార్యనిర్వహణాధికారి

## పినాకినీతీరం

(1వ పేజీ కొరవ)

అంగిత్వంతో జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు గాని, సంఘాలు గాని సక్రమంగా పని చేసి వుంటేవి ఒక్కో చోట ఒక్కో ప్రమాణంతో ఒక్కొక్కరి పలుకుబడికి లోనై నియమించనందువల్లనే ఆ నామినేటెడ్ అధ్యక్షులు వివాదాస్పదులుగానే తమ పదవులు ప్రారంభించవలసివచ్చింది. ప్రకాశం జిల్లాకాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ బాలయ్య అటువంటి వారిలో మొదటివారు. ఆయనకు ఆజిల్లాలోని ముఖ్యులైన కాంగ్రెస్‌వారులనుండి సహకారం కించిత్ అయినా లభించకపోగా, సహాయనిరాకరణం అడుగడుగున ఎదురవుతున్నది. దానికి ప్రత్యక్ష నిదర్శనమే ఉపాధ్యక్ష కార్యదర్శులిద్దరు ఒకర్నొకరు పట్టించుకొని, కాంగ్రెస్ పరువు దీయడం! అసలు బాలయ్య, మాలకొండయ్య ఇద్దరూ కొత్తసంపన్నులైనట్టి కొత్త కాంగ్రెస్‌వాదులట. చిత్తశుద్ధికలిగి చరిత్రకలిగిన కాంగ్రెస్‌వాదులెవరూ జిల్లాకాంగ్రెస్‌కు దొరకలేదుకాబోలు! ఇప్పటికైనా వీరిద్దరూ స్వచ్ఛందంగా తప్పుకోవడం గౌరవప్రదంగా వుండదా? కాంగ్రెస్‌కు మహోపకారం చేసినట్టుగా వుండదా?

ఒంగోలు మునిసిపల్ ఛైర్మన్ శ్రీ బాలయ్యగారు ఉప్పుచెక్కు పదవిలం అనుకోబోతున్నారని ఒకవదంతి ఉట. ఆయన వృత్తి రాజకీయాలుకాదు; కాంట్రాక్టులు. ఇప్పటివరకు పార్టీ మారకుండా వున్నందుకు సంతోషపడాలని నా అభిప్రాయం. పదవి కావాలంటే పార్టీ మారాలి; అది ఈనాటి రాజకీయ సిద్ధాంతం. ఆ సిద్ధాంతాన్ని అనుసరించనివారు వెనుకబడినవారు, గెల్చే గుర్రం మీద పందెం వొడ్డేవారే రాజకీయాలలో వివేకవంతులు- ఈ రోజుల్లో!

బంద్‌లు కాదు-

### గుదిబండలు!

నెలకు ఎన్ని బంద్‌లు? ఎన్ని రిలే నిరాహారదీక్షలు? ఇవంతేవిలువలేకుండా పోయింది, నవ్వులపాలైపోయాయి! ఇవి బంద్‌లుకాదు; ప్రజల నిత్యజీవితానికి గుదిబండలు; దేశప్రగతికి బంతకొయ్యలు అనడం సముచితంగా వుంటుంది.

దేనికైనా పరిమితివుంది; దేనికైనా హద్దుపద్దు వుంది. వ్యాపారస్తులు, బస్ లారీ వగైరా వాహనాల యజమానులు రౌడీజానికి భయపడి బంద్ పేరు చెప్పగానే స్వచ్ఛందంగా బంద్‌చేసి కూర్చోవడాన్ని, బంద్ నిర్వాహకులు తమ ఘనతమని, తమ వుద్యమానికి ప్రజల స్పందన అని భావిస్తే అది కేవలం భ్రమే అవుతుంది. బంద్ జరిపించడానికి ఈ రోజుల్లో పెద్ద బలగం అవసరంలేదు; బలంపనిలేదు. ఒక కరపత్రంచాలు, లేదా కదిలుంది నినాదాలిస్తూ తిరిగేవారుంటే చాలు. ఎక్కడివక్కడ బంద్ అయిపోతాయి. అంగళ్లుతీస్తే దోపిడి చేస్తారేమోనని వారి భయం; ఒకరాయి విసిరితే అద్దాలు పగిలి వందలు వేలు నష్టం ఏర్పడుతుందేమోనని బస్ యజమానుల భీతి; టైర్లు కోసి వేస్తారని, టాపులు చింపివేస్తారని రిక్షా, ఆటో వాళ్ళ తహతహలు; బస్‌లు లేకుండా పల్లెటూళ్ళ నుండి జనం రాకుంటే తమ వ్యాపారం జరగదని హోటళ్ళవారి మూలుగు. ఈ విధంగా ఎవరి భయంతో వారు, ఎవరి బాధతో వారు బంద్‌లకు అర్థనై ఖర్చకు ప్రయాసలేకుండా విజయవంతం చేసేస్తున్నారు. ఇంతకూ బంద్ తాకిడి లేనివాళ్ళు సినిమాహాళ్ళవారే; ఎంతపెద్ద బంద్ అయినా సాయంత్రం నాలుగు గంటలతో సరి కాబట్టి, వారి ప్రదర్శనలు మామూలుగా జరిగిపోతాయి. పైగా బంద్‌వల్ల అందరూ ఖాళీగా వుంటారు కాబట్టి సినిమాహాళ్ళకు ఆరోజు కలెక్షనుకూడా ఎక్కువగా వుంటాయి!

బంద్‌లు చేయిస్తున్నారు, చేస్తున్నారు; వీటివల్ల ఎందరు ఎన్ని విధాలుగా బాధపడిపోతున్నారో ఎవరైనా ఆలోచిస్తున్నారా? అందరి సంగతి పోనీండి; ప్రాణాపాయ స్థితిలో వున్న రోగులకూడా వైద్య సహాయం లేక చావవలసి వస్తున్నదనే వాస్తవాన్ని వీరు గమనిస్తున్నారా? అటువంటి అవసరాలు, వుపద్రవాలు ఎన్ని ఎందరికి వుండవు? వారందరూ ఎంతగా కష్టనష్టాలకు గురి అయిపోతున్నారు? వీటికిమాటికి బంద్‌లు చేయించేవారు మానవతనే మరచిపోతున్నారా అని ఒక్కోసారి అనిపిస్తుంది.

బంద్‌లవల్ల తమ ఆశయానికి ప్రజల సానుభూతి బలం చేకూరుతుందని వీరు పొరబడుతున్నారేమోకాని, సానుభూతి కలిగినవారుకూడా బంద్‌లు కల్గించేబాధల వల్ల వ్యతిరేకులైపోతున్నారు. వారిపుద్యమాలు, ఆశయాలు బంద్‌లవల్ల ప్రజా వ్యతిరేకతకు గురియవుతున్నాయి. ఈ సత్యాన్ని వారు గ్రహించడం అవసరం.

అనవసరమైన బంద్‌లవంటి ప్రజా అసౌకర్య కార్యకలాపాలను ప్రజలుకూడా ప్రతిఘటించకపోతే పోనుపోను ప్రజాజీవితం పూర్తిగా స్తంభించిపోయే ప్రమాదంవుంది. పాలకులకుకూడా వీటిని ఎదుర్కొనే గుండెధైర్యం వుండడంలేదు. అంతపెద్దరైల్వే సమ్మెలో సైతం రైళ్ల నిలవకుండా నడపగలిగినగుండె ధైర్యానికి ఒక్క ఇందిరాగాంధీకే వుండింది. అటువంటి దాడులకే ఆమె భరితయంకరులు కాగలింది; ప్రజల హృదయాలలో శాశ్వతంగా నిల్చిపోగలిగింది!

### తెలుగు కుంభకోణాలు

(2 పేజీ కొరవ)

సావమేమిటో మాకు తెలియదుగాని, ఈ స్థలాన్ని స్వామీజీ తరఫునే ఒళ్ల స్థాట్లకు విక్రయించాలని గట్టిప్రయత్నం చేస్తున్నారట. అసలు అధికారులు ఆశ్రమానికి అంత విలువైన స్థలం ఇవ్వడమే తప్పు: ఇచ్చిన అది వేరే ప్రయోజనాలకు వినియోగించబడుతుంటే చూస్తూ ఊరుకోవడం ఇంకా తప్పు. ఈ భూమి కుంభకోణంలో, నాగిరెడ్డి స్థలం స్వాహాలో అధికారిక తెలుగు నాయకుడి సన్నిహిత బంధువు హస్తంకూడా వుందని తెలిసింది.

ఇదిగాక, సరస్వతి నగర్‌లో పక్కా పోర్టుకు చెందిన 300 అంకణాల స్థలం కూడా వీరి దురాక్రమణలకు, తరసంకర విక్రయాలకు గురౌతూందని చెప్తున్నారు. జాయింట్ కలెక్టర్ దయాచారిగారి వంటి అధికారులు, స్వయంగా శ్రద్ధచూపనిదే ఇటువంటి కుంభకోణాలకు ఫుల్‌స్టాప్ పడదు.

★

### నెల్లూరు సంగతులు

(4 వ పేజీ కొరవ)

నికి కరక సమాఖ్య అధ్యక్షుడు శ్రీ దేవిరెడ్డి కోదండరామరెడ్డి, శ్రీమతి ఎగ్ గాన లక్ష్మమ్మ ఆర్థిక సాయం చేశారట; తెలుగు గంగ ఎగ్జిక్యూటివింజనీరు శ్రీ జె. యస్. రఘుపతిరావు, దళితమహాసభ జిల్లాఅధ్యక్షుడు శ్రీ పి. మస్తానయ్య అధ్యక్షత్వం వహించారు. కలెక్టర్ శ్రీ జన్నత్‌హుసేన్ అన్నదాన కార్యక్రమానికి హాజరై వీరందరికి పనికల్పించే ఏర్పాట్లు చేస్తానని హామీయిచ్చారు.

#### కళాస్రవంతిలో సౌందర నందనం

కళాస్రవంతి, సాంస్కృతిక సంస్థ 31 తేది నెల్లూరులో సౌందర నందనం నాటకప్రదర్శన నిర్వహించింది గుంటూరుకు చెందిన డాక్టర్ చేతవోలు రామబ్రహ్మం దీని రచయిత. కళాకారులు, కూచిపూడి తరహాలో చేసిన ప్రదర్శన, ప్రేక్షకులను ముగ్ధులనుచేసిందట.

ఈ సందర్భంగా చిన్ననల-తెలుగు గంగ స్పెషల్ కలెక్టర్ శ్రీ కె. వెంకటశివయ్య అధ్యక్షించారు. శ్రీ కె. ఎస్. ఆర్. ప్రసాదరావు, రచయిత డాక్టర్ రామబ్రహ్మం, శ్రీ మహంకాళి సత్యనారాయణశర్మ కళాస్రవంతి అధ్యక్షుడు శ్రీ జె. రఘుపతిరావు గోదావరి వరద బాధితుల సహాయంకోసం ప్రేక్షకుల నుంచి 687 రూపాయలు దండారు. కార్యదర్శి శ్రీ జి. ప్రభాకరావు వందనాలు చెప్పారు.

#### క్షత్రియ రక్తదానం

నెల్లూరు, వేదాయపాళెంలోని క్షత్రియ సేవాసమితి సభ్యులు నలుగురు 2 తేది పెద్దాస్పత్రిలో రక్తదానం చేశారు. వారు వివు- ఎం. నరసింహరాజు, కె. తిరుపాలరాజు, వి. రామరాజు, ఆర్.వెంకటరామరాజు.

★

# కాం(గెసు ఊపు

(3 వ పేజీ కొరవ)

తనపుత్రధర్మంకావని, కాం(గెసను పునరుజ్జీవింపజేసి తెలుగుదేశం నవాలును ఎదుర్కొనగల శక్తివంతమైనస్థితికి దానిని తీసుకురావడం తన కర్తవ్యమని తలచి తనకు తానుగా రంగంలోకి దిగారు. "అమ్మ పాలు (తాగాను, అమ్మరుణం తీర్చుకోవడం నా కర్మం" అనేది జనార్ధనరెడ్డి అభి(పాయం. జులై 20 తేది గుమ్మపాటిపాళెంలో జరిగిన గూడూరు డివిజనులోని మండల కాం(గెస్ అధ్యక్షుల, కాం(గెస్ వర్కర్ల సమావేశం జనార్ధనరెడ్డి దృఢ సంకల్పానికి నాంది. ఆ సమావేశంలో ఉత్సాహితమైన కాం(గెస్ వాదుల పుత్సాహం, ద్విగుణీకృతమైన పుత్తేజం జనార్ధనరెడ్డికి కొండంత బలాన్ని చేకూర్చి ముందుకు నడిపింది. గూడూరులో (పారంభమైన జనార్ధనరెడ్డి కాం(గెస్ యాత్ర దక్షిణ తాలూకాలన్నింటిని పూర్తి చేసుకొని మొన్న 6 తేది నెల్లూరు తాలూకాకు చేరింది.

ఆరోజు ఉదయం ఇందుకూరుపేట మండలం కాం(గెస్ వాదుల సమావేశం రాముడుపాళెంలో, తోటపల్లిగూడూరు మండల సమావేశం, ఆ సాయంకాలం చెన్నపల్లిపాళెం సము(దతీరంలో జరిగాయి. ఈ సమావేశాలు విశేష పద్ధతిలో వున్నాయని వినడమేకాని, స్వయంగా చూడలేదు. నెల్లూరుకు దగ్గర కాబట్టి రాముడుపాళెం సమావేశానికి హాజరయ్యే అవకాశం కలిగింది. సమావేశమంటే ఒకటి రెండు గంటలు కాదు; నాలుగు గంటలు; పదుము పనికిరాలేదనుకోండి! వెంకటగిరి, తదితర సమావేశాలతో పోలిస్తే ఇది అతి తక్కువ కాలమట.

పైపాడు ఐస్ ఫ్యాక్టరీ కోసం, రాముడుపాళెం (గామంలోను కాం(గెస్ కార్యకర్తలను అభిష్కరించారు జనార్ధనరెడ్డి. అసలు సమావేశం రాముడుపాళెం పూరికి పైలుదూరంలో పచ్చనిచేలమధ్య ఆహ్లాదకరమైన వాతావరణంలో.... చుట్టు(పక్కల గ్రామాలనుండి వచ్చారు; కరకాలు కాం(గెస్ వర్కర్లుకాదు, నికార్సయిన నరుకు; వెయ్యిమందివరకు హాజరై వుంటారు. ముందు జనార్ధనరెడ్డి (పారంభోపన్యాసం చేశారు; తర్వాత వర్కర్లు చాలమంది తమ అభి(పాయాలు చెప్పారు; ఆఖరుగా జనార్ధనరెడ్డి (పసంగం నాలుగు గంటల సమావేశంలో జనార్ధనరెడ్డి (పసంగం రెండుగంటలకుపైగా వుంటుంది; చెత్తకాదు, పూకదంపుడు అంతకంటే కాదు; కాం(గెస్‌ను పూరుపూరికి వాడవాడకు ఎట్లాతీసుకపోవాలి, కాం(గెస్ వాదులు ఎట్లాపనిచేయాలి అనేఅంశంమీద ఆయన వుపన్యాసం కేం(దీకృతమైంది. ఆఖరున మండలస్థాయిలో రెండు కమిటీలు వేయబడ్డాయి. ఒకటి-రక్షణసంఘం ((పాతినిధ్య కమిటీ), రెండు-సంక్షేమ సంఘం (వెల్ఫేర్ కమిటీ). (పతిచోటా ఈవిధంగానే నియమింపబడుతున్నవట. మొదటిది అధికార్లనుండి, అధికారపార్టీ నుండి జరిగే అన్యాయాలను, అ(కమాలను ఎదర్కోడానికి; రెండవది (పజా సమస్యలను చేపట్టి పనిచేయడానికి వుద్దేశించబడింది. ఈ కమిటీ సభ్యులు (పతి ఒక్కరూ ఒక డైరీ చేతపట్టుకొని, కాం(గెస్ అభిమానులైన యువకుల పేర్లు (వానుకొని, వారి సమస్యలు విచారించి, వారితో నిత్యసంబంధం కలిగివుండాలని జనార్ధనరెడ్డి కోరారు.

పాతుగ్రమం చెన్నపల్లిపాళెంలోకూడా ఇటువంటి సమావేశమే జరిగింది. రాముడుపాళెంనుండి చెన్నపల్లిపాళెం పోయేదారిలో రొయ్యలచెరువులో గండవరపు హనుమారెడ్డిగారి స్మృతి చిహ్నంగా కాం(గెస్ జండాను (పతిష్ఠించారు. చెన్నపల్లిపాళెం సభ అదేవిధంగా పుత్సాహభరితంగా జరిగింది. ఈ సమావేశాల విశేషం కులమతవర్గ రహితంగా అందరూ పాల్గొనడం; మనసువిప్పి మాట్లాడడం!

రాముడుపాళెం సమావేశాన్ని మండల కాం(గెస్ అధ్యక్షుడు శ్రీ బెజవాడ రామచం(దారెడ్డి, జిల్లా కాం(గెస్ కోశాధికారి శ్రీ జె. కె. రెడ్డి నిర్వహించారు; శ్రీ కె. చం(దశేఖరరెడ్డి, రాయసం వెంకటేశ్వర్లు, గోళ్ళ భాస్కరరావు (పభృతులెందరో (శమ తీసుకొని సహకరించారు. చెన్నపల్లిపాళెం సమావేశాన్ని తోటపల్లిగూడూరు మండల కాం(గెస్ అధ్యక్షుడు శ్రీ టంగుటూరు శ్రీనివాసులు రెడ్డి (ఈదూరు), శ్రీ చిల్లకూరు సుధీర్ రెడ్డి (పోట్లపూడి) చక్కగా ఏర్పాటు చేశారు. ఏటి రెంటింటి వెనుక పనిచేసిన సమన్వయ శక్తి శ్రీ సి. వి. శేషారెడ్డి.

జనార్ధనరెడ్డి జిల్లావ్యాప్తంగా, (కమబద్ధంగా జరుపుతున్న ఈ సమావేశాలు జిల్లాలో కాం(గెస్‌వాదులలో నూతనోత్సాహాన్ని కల్గిస్తున్నాయి; వూపునిస్తున్నాయి; కాం(గెస్ సంస్థకు కొత్తజీవాన్ని పోస్తున్నాయి. కాం(గెస్ భవన నిర్మాణం, కాం(గెస్ పునరుజ్జీవనం- జనార్ధనరెడ్డి జిల్లాకు సంబంధించినంతవరకైనా మరచిపోలేని వంచికార్యాలు. ★

---

ఆం(ధ(పదేశ్ పాడిపరి(శమాభివృద్ధి సహకార సమాఖ్య లిమిటెడ్

నెం. 1609/బి/85 తేది 28-8-86

## నోటిఫికేషన్

నెల్లూరు మలేకారుపేటలో వున్నటువంటి విజయా డైరీ పార్లరును కమీషన్ ఏజెన్సీ షరతుపై ఒక సంవత్సరమునకు యిచ్చుటకు ఈ (కింద తెలిపిన షరతులతో సీలు వేయబడిన కొటేషన్లు కోరబడుచున్నవి.

1) నెల్లూరు డైరీ, నెల్లూరు వారిచే సరఫరా చేయబడు పాలు మరియు పాల ఉత్పత్తులు మా(తమే అమ్మవలెను.
2) ధరావత్తు (కింద రు. 10,000/-లు (పదివేల రూపాయలు) డిమాండు (డాఫ్టుద్వారా మేనేజింగ్ డైరెక్టరు ఎపిడిడిసి నెల్లూరు వారిపేర చెల్లించవలెను ధరావత్తులేని దరఖాస్తులు చెల్లబడవు.
3) పార్లరు అద్దె మరియు కరెంటు చార్జీలు నెలనెలా స(కమముగా చెల్లించవలెను.
4) (పస్తుతపు పార్లరు అద్దె నెలకు రు. 1817/-లు అంతకన్న ఎంత ఎక్కువ చెల్లించగలరో వివరముగా తెలుపవలెను.
5) కమీషన్ ఈ (కింద తెలిపిన విధముగా చెల్లించబడును.

| | | |
|---|---|---|
| ఎ) | పాలు లీటరు ఒక్కటింటికు | 0-05 పైసలు |
| బి) | నెయ్యి కిలో .. | 1-40 .. |
| సి) | మజ్జిగ ½ లీటరు .. | 0-25 .. |
| డి) | శక్తి మిల్క్ 180 (గా. | 0-35 .. |

కమీషన్ రేటు హెడ్ ఆఫీసు అర్డరు (పకారము మారుచుండును వీటికి బాధ్యులై వుండవలెను.

కావున దరఖాస్తులు చేయగోరువారు తేది 19-9-86 3 గం॥ లోపు పూర్తి వివరములతో కొటేషన్లు (సీలు చేయబడినవి) పంపవలెను కొటేషన్లు అదేరోజు సాయంకాలము 4 గం॥కు కొటేషన్ దారుల సమక్షమున తెరువబడును ఇతర వివరములు ఆఫీసు పనిచేయు వేళలలో తెలుసుకొనవచ్చును.

జాయింట్ డైరెక్టర్

---

## కృష్ణ పరమాత్మ

(9వ పేజీ కొరవ)

సన్నివేశమూ (పేక్షకులను ఆకట్టుకోలేకపోయింది. కథరీత్యా కీలకమైన గోపికృష్ణపాత్రకు ఎక్కువ (పాముఖ్యత లేకపోవడంతో ఆ పాత్ర వెలితిపడ్డది. విజయశాంతి చెల్లెలు భానుమతి (పక్కన నిద్రపోవడం, ఆమెతో వీధుల్లో పాటలు పాడుతూ కుప్పిగంతులు వేయడం, ఆమె సూట్‌కేస్ అతని వీపుమీద పడడం అసహ్యంగావుంది. ఇది పూర్తిగా సినిమాదితం రిటైర్డ్ స్టేజిలోవున్న పోలీస్ కమీషనర్ పాత్ర హుందాతనాన్ని కోల్పోయింది. అతను అనర్ఘ గృహిణి అయిన భార్యపైన అకారణ ద్వేషాన్ని పెంచుకోవడం ఎందుకో అర్థంకాదు. యుక్తవయస్కులైన పిల్లలను బెల్టుతో అతి క్రూరంగా కొట్టడం, గర్భవతిగా వున్న కుమార్తెమీద చేయి చేసుకోవడం అసహజంగావుంది. ఎంత దుర్మార్గుడైనా బిడ్డలపట్ల తండ్రి (పవర్తన ఆ విధంగా వుంటుందా?

విలనీని సృష్టించడంలో కూడా దర్శకురాలు విఫలమయ్యింది. మన్మథరావు స్త్రీలోలుడని చెప్పేందుకు అన్ని రేప్‌లు చూపించనవసరంలేదు. విలన్ ఒక జోకర్‌లా వున్నాడు. హాస్యం లోపించడంకూడా చి(తానికి ఒకలోటం. పతాకసన్నివేశ చి(తీకరణ మా(తం బాగుంది.

సామాజికస్పృహ కల్గిన ఇతివృత్తంతో రాము పాంత్యన్ రూపొందించిన కథ చి(తీకరణలోని అసమ(గతవల్ల అభాసుపాలైంది దర్శకురాలుగా విజయనిర్మల అసమర్థతను ఎత్తిచూపుతుంది చి(తం.

గోపీకృష్ణగా కృష్ణ బాగానే నటించాడు, భానుమతిగా రాధిక, వరసింహం భార్యగా కె.ఆర్. విజయ చక్కగా నటించారు. సత్యానంద్ కూర్చిన సంభాషణలు పరవాలేదు. కె. వి. రాఘవుల సంగీతం అంతంతమా(తమే.

---

## రేపటి పౌరులు

(9 వ పేజీ కొరవ)

తున్నారు; అట్లా జరుగకుండా చూడాల్సిన బాధ్యత తల్లి తం(డులది, ఉపాధ్యాయులది అని హెచ్చరిస్తున్నాడు. కుళ్ళి కంపుకొడుతున్న ఈ సమాజంలోంచి ఓ నవభారత నిర్మాణానికి కలలుకంటూ, క్రాంతిదర్శియై చైతన్యగీతం ఆలపిస్తున్నాడు. అందులో పాలుపంచుకోమని మనల్ని వేడుకుంటున్నాడు. ఆయన ఆలోచనా సంవిధానం అభినందనీయం. అనుసరణీయం. ఈ తరుణంలో ఇటువంటి చి(తాల ఆవశ్యకతకూడావుంది.

ఉపాధ్యాయునిగా విజయశాంతి (పదర్శించిన హావభావాలు సమర్థవంతంగా లేవు పోలీసు ఆఫీసరుగా కోట శ్రీనివాసరావు చక్కనినటన (పదర్శించారు, వేలు ఫర్వాలేదనిపించారు, రాళ్ళపల్లిమం(తిగా రాజశేఖర్ అభ్యుదయ భావాలున్న యువకుడిగా జీవించారు.

(పజాన్యాయస్థానం వంటివి కొంచెం అతిగా అనిపిస్తాయి, చిన్నపిల్లలు పెద్దగా మాట్లాడటం ఎబ్బెట్టుగా తోస్తుంది. అయితే అంతటి మహోన్నతభావ సందర్భంలో ఇవి లోపాలుగా కన్పించవు. లాయర్ని, పబ్లిక్ (పాసిక్యూటర్‌గా చూపించి వుంటే సమంజసంగా వుండేది.

హరనాథరావు మాటలు చి(తానికి జవజీవాల్ని తెచ్చిపెట్టాయి. అసెంబ్లీయో, పార్లమెంటో అనుకొని కొట్టుకుంటారేమో ఐది ఐదీ అని చేసిన హెచ్చరిక, మా నాన్న మా అమ్మ కావ్పుకు, మా తాత దగ్గరకూడా మృందానికి లంచం వసూలు చేశాకు అని వార్డరు కొడుకు చెప్పడం లాంటివి హరనాథరావు 'శక్తి'ని (పతి ఘటన తర్వాత మరోసారి వెల్లడించాయి.

'రేపటి పౌరులం' అనేపాట చక్కని సందేశాత్మకంగా సాగి, సినిమా (పయోజనం తెలుపుతుంది. ★

---

## ఆ(కమణ

(4వ పేజీ కొరవ)

పరిస్థితులలోకూడా, ఈ కాలువపై నీటికోసం ఆధారపడిన రైతులు ఆశలు వదలుకోవలసిందే!

అసలు పిడబ్ల్యుడి స్థలాన్ని ప్రైవేటు వ్యక్తులకు ఎందుకు లీజుకు ఇవ్వవలసి వచ్చింది? ఇచ్చినా, పిడబ్ల్యుడి వారు పుష్కలమైన నాన్ని వెచ్చించి గోడ ఎందుకు కట్టించారు? ఆ తర్వాతకూడా కాలువను ఆ(కమించి, గోడలు లేపుతుంటే అధికారులు ఎందుకు మౌనం వహించినట్లు?

కొందరు చెప్పడం, పిడబ్ల్యుడి అధికారులు పొరపాటున కాలవ (పక్కస్థలమే గాక, కాలువనుకూడా కట్టా(కింద (వాసిచ్చారని, అందువల్లే వారు ఉ(గంగా గోడలు కట్టారని! అదే నిజమైతే ఈ పొరపాటు ఎవరివల్ల, ఎన్నేళ్ళ(కితం జరిగింది? ఈ (పాంతంలో అంకణం స్థలం 10 వేలకు పైగా ధర పలుకుతూందట. భవిష్యత్తులో ప్ర- ను బస్టాండును కూరగాయల మార్కెట్ (కింద మార్చాలనే ప్రతిపాదనకూడా వుండడంవల్ల దీని విలువ అపరిమితం, ఇప్పుడు పిడబ్ల్యుడి వారు దఖలు పర్చిన స్థలం 90 అంకణాలవరకు వుందని అంటే, అంటే 9 లక్షలు!

కలెక్టరుగారూ- మీరొకసారి అక్కడికి వెళ్ళి పరిస్థితిచూసి, జరిగిన అన్యాయాన్ని సరిదిద్దకూడదా? ★

---

## (పకటన

నెల్లూరుటవున్ పత్తిభాజిపేట పెంచలాచారివీధి కాపురస్తురాలు శ్రీ కడివేటి వెంకట శేషయ్యగారిభార్య కడివేటి మునెమ్మ అను నేను ఇందుమూలముగా తెలియజేయడమేమనగా

నాకు మా తల్లిదం(డులద్వారా సం(కమించి, నాకు హక్కుగలిగి నా స్వాధీనానుభవంలో వుంటూవున్న స్థిరచరాస్తులను నా అన్నగారయిన శ్రీ సర్వేపల్లి మునిరత్నం అమ్మదలచినట్లు నాకు తెలియవచ్చినది. నా ఎరుక, సమ్మతి లేకయే సదరు ఆస్తులను మా అన్నగారు వి(కయించుటకు హక్కులేదు. అట్లు వి(కయించినను సదరు వి(కయములు చెల్లవు. ఆ వి(కయములు నన్ను బద్ధగించవు. కనుక ఈ విషయం (పకటనద్వారా తెలియజేయడమైనది. ఎవరైనా మా అన్నగారివల్ల వి(కయఅ(గిమెంట్లుగాని వి(కయములుగాని చేసుకొన్నయెడల నేను చేయు సివిల్, (కిమినల్ వ్యవహారములకు. నా ఖర్చులకు బాధ్యులగుదురని ఇందుమూలముగా తెలియజేయడమైనది.

-కె. మునెమ్మ.

---

శ్రీ కోదండరామస్వామి దేవస్థానం

## టెండరు నోటీసు

చింతోపు(గామం తోటపల్లిగూడూరు మండలం. నెల్లూరుజిల్లా శ్రీ కోదండరామస్వామి దేవస్థానం తాలూకు దిగువ కనబరచిన పనులకు అనుభవముకలిగిన కంట్రాక్టర్లనుండి నిర్ణీత ఫారములలో సీల్డు టెండర్లు కోరబడుచున్నవి.

పనివివరము: దేవాలయం రినోవేషన్ అంచనా విలువ: రు. 19,700/- లు. టెండరు ధరాతరు: రు. 500/-. పని కాలము: 3 నెలలు. టెండరు ఫారము ఖరీదు రు. 50/-.

షరతులు: 1) టెండరు షెడ్యూలు కొరకు 22-9-86 తేది వరకు స్వీకరించబడును. 2) టెండరు షెడ్యూలు 23-9-86 తేది నుండి 24-9-86 తేది వరకు ఇవ్వబడును. 3) టెండర్లు స్వీకరించు తేది 25-9-86 మ. 4 గం. వరకు. 4) టెండర్లను 26-9-86 తేది ఉ. 11 గం. కు సహాయ కమీషనరు, దేవాదాయ ధర్మాదాయ శాఖ, నెల్లూరు వారి ఆఫీసునందు తెరువబడును. 5) టెండరు ధరావత్తును దేవస్థానము వంశపారంపర్య ధర్మకర్తగారికి పైకంచెల్లించి పొందిన రశీదునుగాని లేక పంజాబ్ నేషనల్ బ్యాంకు, నెల్లూరు (బాంచి పేరున డిమాండు (డాఫ్టునుగాని టెండరుతో జతపరచి పంపవలెను 6) అనుభవ:తెలుపు రిఫికేట్లను రిజిస్ట్రు మరియు నకలుకాపి టెండరుతో జతపరచగలరు. 7) మీకు మేముతెలిపిన షరతులలోగాని, పనులలోగాని ఎటువంటిఅభ్యంతరములున్నను ముందుగాగాని, టెండరుతోగాని, వేరు కవరునందు పొందుపరచి, తెలపుకొనగలరు. 8) ఎట్టికారణముచూపకుండా టెండరును గాని, టెండరులోని కొన్ని భాగములను గాని తొలగించుటకుగాని అంగీకరించుటకుగాని దేవస్థానము వారికి పూర్తిహక్కు కలదు

.మాగుంట బలరామరెడ్డి,
వంశపారంపర్య ధర్మకర్త

---

## జమీన్‌రైతు చందా

| | |
|---|---|
| సంవత్సర చందా | 50.00 |
| ఆరునెలలకు | 26.00 |
| విడి (పతి | ఒక రూపాయి |

# జిల్లావార్తలు

(వేవ పేజీ కొనవ)

చేసింత వచుసుకోళ్లినది వారి దాంతక్య తేసవం.

పోలీసు సమగ్రంగా, లోతుగాదర్యాప్తు జరపితే వాస్తవం వెలికిరాదు.

**పద్యపుదొక్కాల సేకరణ-**
**అయ్యవార్ల పాట్లు**

ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావు తెలుగు చిరంజీవులకు ఆహ్వానించ తల పెట్టిన తెలుగు పద్యపుదొక్కాలు, తెలుగు ఐచివంతుల్ని ప్రాణాలు తోడేస్తున్నాయి. ఏ గ్రామానికి, ఏ పారశాలకు చొక్కా చెప్పుకిస్తారో అధికారులు స్పష్టంగా చెప్పలేపోయినప్పటికీ, అయ్యవార్లు ఎక్కా తండే అప్పుడు ఐసివదలి పోవలసి వస్తున్నది. ఓ ఒక్కటికిపోతే స్కూళ్ళు ఐన్నిపెట్టకుండాపు, ఆయనుంటే మంత అధికారి దొరకడు. ఒకవేళ దొరికినా వుంటే, పొక్కాలు ఎలికన్ని వుండవు అక్క కూడ తాలూకాలో సగం ఐదులు ఈ కారణంతో మూలపడుతున్నాయి. అక్కా దప్పుడు ఈ తిరుగుళ్ళలో పుణ్యకాలం కరిపోతే, ఇక మీరు చదువులు చెప్పే దెంది అని గ్రామస్తులు నిసుక్కుంటున్నారట. ఇంత కష్టపడి సేకరించి తెచ్చిన పద్యపుదొక్కాలు వేసుకోవడానికి పిల్లలూ ఇష్టపడుతున్నట్టులేదు.

అన్నగారి కార్యక్రమాలన్నీ ఇట్లా ఏడుస్తున్నాయి!

**ఆత్మకూరులో**
**గణపతుల గుంపు**

ఆత్మకూరు టౌన్‌లో, చుట్టుపక్కల గ్రామాల్లో వీధి వీధినా వినాయకుల్ని వెలిగారీ సంవత్సరం. ఆ ఎలుకవాహనా రూఢుడికి ఎన్నిపూజలో, ఎన్నిరాత్రులు హరికథాది కాలక్షేపాలో, ఎన్నిఐపాలో గ్రామాల్లో ఎన్ని ఊరేగింపులో చెప్పలేం. మ వవిఘ్నేశ్వరుడికి భక్తి ఇంతగా పెరగడం విచిత్రంగా, విశేషంగావుంది.

**ఇందుకూరుపేట**
**ఉత్తమోపాధ్యాయుడు**

ఇందుకూరుపేట సమితికి 86-87 సంవత్సరానికి ఉత్తమ ఉపాధ్యాయుడుగా నారాయణరెడ్డిపేట హైస్కూలు టీచరు శ్రీ కె. ఆదిశేషయ్య ఎంపికైనారు. 5 తేది నెల్లూరులో జరిగిన గురుపూజోత్సవంలో ఆయనకి ప్రశంసాపత్రం లభించింది

**లారీప్రమాదంలో**
**సైకిలిస్టు మృతి**

అల్లీపురం సమీపంలో లారీ ఢీకొని గి వెంకటసుబ్బారెడ్డి (45) అనే టీచరు మృతిచెందాడు. ఈ దుర్ఘటన 3 తేది జరిగింది. వెంకటసుబ్బారెడ్డి చిన్నచెరుకూరు హైస్కూలులో పనిచేస్తున్నాతట, ఇంటినుండి అల్లీపురానికి సైకిల్ లో పోతుండగా వరుకూరునుంచి నెల్లూరు వస్తున్న లారీ గుద్దిందట. లారీ డ్రైవర్ క్లీనర్ పలాయనం చిత్తగించారు పోలీసు కేసు దర్యాప్తుచేస్తూంది.

**కావలి గురుపూజ**

కావలి లయన్స్‌క్లబ్ మొన్న 5 వది మల్లారెడ్డి భవనంలో గురుపూజోత్సవం జరిపింది. ర ఉపాధ్యాయుడు శ్రీ సి. రాజగోపాలరెడ్డి అధ్యక్షతవహించారు సభలో, ఐవహర్‌భారతి లెక్చరర్ డబలి రాధాకృష్ణ

శ్రీ ఎ. యం. గోపాలరావును శాలువతో సత్కరించారు. ఈ సందర్భంగా, జంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు, శ్రీ ఎన్. మాలకొండయ్య రచించిన కలగోకమ్మ కళకాన్ని ఆవిష్కరించారు. పాత్రికేయుడు శ్రీ శ్రీవరాంమ వర్మానిం చారు. తర్వాత అష్టావధానం జరిగింది. తిరుపతి, అన్నమాచార్య ప్రాజెక్టు డైరెక్టరు శ్రీ మేడసాని మోహన్ దీన్ని నిర్వహించారు; శ్రీ ఎస్. వి. భుజంగ రాయశర్మ అధ్యక్షించారు.

**మందులు, డాక్టరు లేని**
**చిన్నచెరుకూరు ఆస్పత్రి**

స్వర్గీయ సన్నపురెడ్డి సుబ్బరామరెడ్డి చిన్నచెరుకూరులో 55 లో నెలకొల్పిన ధర్మాయుర్వేద ఆస్పత్రి ఆలనా పాలనా లేక అధ్వాన్నంగా తయారైవుంది. విశాలమైన ఆవరణంలో 6 గదులు కలిగిన భవనం అది. అక్కడొక ఆర్. ఎం. పి. డక్టరు, ఒక మెడికల్ ఆసిస్టెంట్‌ను నియమించారు. ఒకప్పటి కాలం వరకు గ్రామస్థులకు ఈ ఆస్పత్రి ఎంత యోగకరంగానే వుండేది. మందులు కూడా ఇస్తూండేది. కాని, ఐదేళ్ళనుంచి మందులు రావడంలేదట. సర్వంటే మందులు తెప్పించాలి. ఎంతకాదనో ఆయన అది మానుకొన్నాడు. మందులు లేకపోవడంతో డాక్టరుకూడా ఆస్పత్రికి రావడం మానేశాడు. నెలకోసారి వచ్చి సంతకాలు పెట్టి వెళ్ళిపోతుంటాడట. వారికి ఉచితంగా జీతాలు చెల్లిస్తున్నారు. ఆస్పత్రికి ప్రహరీగోడలేనందున కొందరు దురాగ్రమణచేసి ఇళ్ళు కట్టుకొన్నారు. ఈ ఆస్పత్రి ఇక్కా నిరుపయోగం కావడంతో గ్రామస్తులు చిన్న రోగాలకుకూడా నెల్లూరు పరుగెత్తవలసివస్తూంది. డి. డి. ఒ., జిల్లా ఆరోగ్యశాఖాధికారులు ఈ ఆస్పత్రిని తనిఖీచేసి, గ్రామానికి ఉపయోగపడేలా చేయాలి.

**దేవాలయంలో చోరీ**

ఇందుకూరుపేట తాలూకా ఈ డి వి పాలెంలోని రామలింగేశ్వరస్వామి ఆలయంలో 30 తేదిరాత్రి దొంగలుపడి, రాగిపాత్రలు, నాగాభరణం తదితర వస్తువులు తస్కరించుకపోయారట. పోలీసు కేసు నమోదుచేసుకొని దర్యాప్తు చేస్తున్నారు.

**వింజమూరు గురుపూజ**

ఉపాధ్యాయ దినోత్సవ సందర్భంగా వింజమూరు జి. ప. హైస్కూల్‌లో 'గురుపూజ' జరిగింది. శ్రీ షణ్ముఖాచారి, శ్రీ సి. హెచ్. రామారావు, శ్రీ వి శేషారెడ్డి, శ్రీ కె. వెంకటేశ్వర్లు శ్రీమతి జయ లక్ష్మి తదితరులు మాట్లాడారు. క్విజ్ వక్తృత్వపోటీలలో గెలుపొందినవిద్యార్థులకు బహుమతులుఅందించెట్టారు. తాలూకా ఉత్తమ ఉపాధ్యాయుడుగా ఎంపికైన శ్రీ ఎస్. ప్రసాదరావును సభలో అభినందించారు.

★

**ఉత్తరక్రియలు**

మా తండ్రి **గునుపాటి సుందరరామిరెడ్డిగారు**
Ex. V. M.
ఇందుకూరు పేట లిట్. I
తేది 8.9.86 సోమవారము స్వర్గస్తులైనారు.
17.9.86 బుధవారం సిలువు
18.9.86 గురువారం ఎత్తురేవు
ఉత్తరక్రియలు కొత్తూరులో మా స్వగృహమున జరుగును.
గాన తెలుపడమైనది.
జి.ఆదిశేషారెడ్డి & బ్రదర్స్

# ఆంధ్రాబ్యాంక్, మేనకూరు

(8 పేజీ కొనవ)

| వ. నం. | వ్యక్తి పేరు మరియు చిరునామా | నికర తూకం గ్రాములలో | జె. ఎల్. నం. |
|---|---|---|---|
| 32) | నంబి మునెయ్య తండ్రి ఐక్కయ్య ఎర్రంశెట్టిపాలెం | 27 | 7/283 |
| 33) | ఒంటిరెడ్డి వసుంధరరెడ్డి తండ్రి రామచంద్రారెడ్డి. పొంచూరు | 9 | 7/295 |
| 34) | జమళ్ళ మునెయ్య తండ్రి రామలింగయ్య అత్తివరం | 25 | 7/296 |
| 35) | చియ్యారపు సుబ్బరామయ్య తండ్రి చెంగయ్య మేనకూరు | 8 | 7/317 |
| 36) | కె. వి. నరసయ్య తండ్రి వెంకట సుబ్బయ్య వెంకటగిరి | 47 | 8/3 |
| 37) | విన్నమాల సుబ్బారెడ్డి తండ్రి వెంకటరామరెడ్డి మేనకూరు | 26 | 8/11 |
| 38) | జ్యోతి రామకృష్ణయ్య తండ్రి నరసయ్య పొలచూరు | 27 | 8/16 |
| 39) | మల్లప సుబ్రమణ్యం తండ్రి చెంగయ్య నెమళ్ళపూడి | 46 | 8/20 |
| 40) | ఎద్దు భూపయ్య తండ్రి వెంకటయ్య గ్రద్దగుంట | 6 | 8/22 |
| 41) | నైనారి వీరరాఘవులు తండ్రి జయరామయ్య మేనకూరు | 4 | 8/51 |
| 42) | మొలగనూరు రమణయ్య తండ్రి వెంకట సుబ్బయ్య మేనకూరు | 19 | 8/84 |
| 43) | ఎద్దల చెంగా రెడ్డి తండ్రి ముని రెడ్డి మేనకూరు | 9 | 8/89 |
| 44) | ఐట్టిపాటి రంగయ్య తండ్రి వెంకటసుబ్బయ్య భీమవరం | 8 | 8/91 |
| 45. | అటపాక జగంధార్ యయ్య తండ్రి చెంగయ్యశెట్టి, మేనకూరు | 27 | 8/102 |
| 46. | ఐనుగుంట నాగరాజు తండ్రి తాతయ్య యర్రంశెట్టిపాళెం | 17 | 8/107 |
| 47. | పిడూరు శేషారెడ్డి తండ్రి చెంగారెడ్డి 3-8-14, రాజగోపాలపురం, నాయుడుపేట | 62 | 8/113 |
| 48. | విన్నమాల సుబ్బారెడ్డి తండ్రి వెంకట్రామిరెడ్డి, మేనకూరు | 5 | 8/116 |
| 49. | దాసరి వెంకటసుబ్బయ్య తండ్రి పోడిశెట్టి, మేనకూరు | 7 | 8/120 |
| 50. | ముప్పాళ్ళ జయరామరాజు తండ్రి సుబ్బరాజు, కోనేటిరాజుపాళెం | 15 | 8/129 |
| 51 | వర్కెపల్లి పోలయ్య తండ్రి గురవయ మేనకూరు | 20 | 8/131 |
| 52. | సి. హెచ్. రాజేంద్రనాయుడు తండ్రి దశరథరామానాయుడు. మేనకూరు | 23 | 8/136 |
| 53. | పేరంశెట్టి రాజేశ్వరమ్మ భర్త గురునాథం మేనకూరు | 26 | 8/143 |
| 54. | నెలబల్లి మునెయ్యనాయుడు తండ్రి వెంగయ్యనాయుడు, మేనకూరు | 21 | 8/146 |
| 55. | యద్దల జయరామిరెడ్డి తండ్రి పోలిరెడ్డి మేనకూరు | 15 | 8/154 |
| 56. | కట్టా చంద్రశేఖరరెడ్డి తండ్రి మీరాస్వామిరెడ్డి, మేనకూరు | 15 | 8/157 |
| 57) | సుబ్బారి చంద్రశేఖరయ్య తండ్రి రామమూర్తి, నాయుడుపేట | 15 | 8/160 |
| 58) | నంబి మునెయ్య తండ్రి ఐక్కయ్య యర్రంసెట్టిపాళెం | 4 | 8/164 |
| 59) | పాలూరు రవీంద్ర తండ్రి లింగాచారి, భట్ల కనుపూరు | 11 | 8/172 |
| 60) | మొగరాల పార్థసారథి తండ్రి నారాయణరెడ్డి. C/o. తెంచుసుబ్బయ్య. బజారు వీధి. నాయుడుపేట | 30 | 8/176 |
| 61) | దాసరి శంకరయ్య తండ్రి పెరయ్య. మేనకూరు | 5 | 8/181 |
| 62) | పి. మునెయ్య తండ్రి మునుస్వామి మేనకూరు | 4 | 8/187 |
| 63) | నాసిన నాగేశ్వరయ్య తండ్రి చిన కాళహస్తిసెట్టి, మేనకూరు | 21 | 8/189 |
| 64) | పాలూరు రాజగోపాల్ తండ్రి లింగయ్య ఆచారి మేనకూరు. | 9 | 8/190 |
| 65) | లింగారెడ్డి శంకరరెడ్డి తండ్రి రామకృష్ణారెడ్డి, నెలబల్లి | 30 | 8/194 |
| 66) | ఎద్దుల వేణుగోపాల్‌రెడ్డి తండ్రి వెంకురెడ్డి మేనకూరు | 22 | 8/199 |
| 67) | ఆడేరి వెందుకృష్ణయ్య తండ్రి పోలయ్య మేనకూరు | 18 | 8/201 |
| 68) | వేను రామసుబ్బయ్య తండ్రి నారయ్య పద్దిగుంట ఖండ్రిగ | 18 | 6/N/23 |
| 69) | నెలబల్లి హరనాథనాయుడు తండ్రి వెంకటప్పనాయుడు, మేనకూరు | 60 | 6/N/92 |
| 70) | ఎ. చిన్నయ్య తండ్రి చెంగయ్య,అత్తివరం | 10 | 7/N/18 |
| 71) | క్రై. చంద్రశేఖరరెడ్డి తండ్రి మీరాస్వామిరెడ్డి, మేనకూరు | 22 | 7/N/99 |
| 72) | ఉంబూరి మునుస్వామి తండ్రి మునుస్వామి. మేనకూరు | 14 | 7/N/10[illegible] |

బ్రాంచి మేనేజరు.

ప్రింటెడ్ [illegible] 17/170 [illegible]